# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట్రామానాయుడుగారు

సంపాదకుడు నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి 57 సంచిక 52
26-12-1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


## అన్నకు తాను విధేయుడనని అన్నిసార్లు చెప్పడందేనికి?

రెవిన్యూమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి గత కొద్దిరోజులుగా వార్తలలో వుంటున్నారు. ముఖ్యంగా కేంద్ర పరిశ్రమలమంత్రి శ్రీ జలగం వెంగళరావు,

మా హైదరాబాదు ప్రతినిధి

తెలుగుదేశం ప్రభుత్వానికి మధ్య చెలరేగిన వాదోపవాదాల విషయంలో ఆయన తెలుగుదేశం నాయకులందరికంటే ముందువున్నారు. శ్రీ వెంగళరావుపై అత్యంత తీవ్రమైన ప్రత్యారోపణలు, నిందలతోకూడిన ప్రకటనలు ఆయనచేశారు. అదేవిధంగా తెలంగాణా ఎన్. జి. ఓ. ల నాయకుడు శ్రీ బి. స్వామినాథం రాష్ట్రంలో రాష్ట్రపతిపాలన కావాలన్నప్పుడుకూడా ఆయనేముందుగా ప్రతిస్పందించి, స్వామినాథం ప్రకటన వెనక కాంగ్రెసు అదృశ్యహస్తంవుందని ఆరోపించారు.

శ్రీనివాసులురెడ్డి సామాన్యంగా తెలుగుదేశంపార్టీ తరపున ప్రకటనలు చేసే మనిషికాదు. ఆయనకు కొంతకాలంగా ఆరోగ్యంకూడా బాగలేదు. అయితే ఆయన ఆరోగ్యం ఇటీవల కొంత మెరుగుపడింది. అడపాదడపా అన్నాళ్ళుగల మాట్లు మానివేశారు. ఇప్పుడు తేటగా, చురుకుగా కనపడుతున్నారు. రాజకీయంగా స్పష్టమైన అవగాహన, అనుభవం కలిగిన తెలుగుదేశంలోని అతికొద్దిమంది నాయకులలో శ్రీనివాసులురెడ్డి ఒకరు.

1984 ఆగస్టులో నాదెండ్ల భాస్కరరావు తిరుగుబాటు చేసిననాడు, భాస్కరరావు రాజీనామా చేసిన గంటలోపలే శ్రీ రామారావుకు మద్దతుగా ప్రకటనచేసిన తొలి మంత్రి ఆయనే! అలాగే శ్రీ వెంగళరావు తెలుగుదేశంలో మరో నాదెండ్ల వస్తా తన్నప్పుడుకూడా శ్రీనివాసులురెడ్డి మొదటగా దానిని ఖండిస్తూ ప్రకటనచేశారు. ఆతర్వాత జరిగిన లెజిస్లేచర్‌పార్టీ సమావేశంలోకూడ ఆయన ఇదంతా కాంగ్రెస్ కుట్రలో భాగమన్నారు. తాము రామారావుకు విధేయులమని, ఈ విషయంలో ఎటువంటి అపోహలు, అనుమానాలకు ఆస్కారం వుండరాదన్న ధోరణిలో హామీ ఇచ్చారు.

ఆయన ఎందుకు ఇంతగా పట్టుబడుతుని ఈ విషయంలో వివరణ యిస్తున్నారని ఆశ్చర్యపోయే విధంగా ఆయన ప్రవర్తిస్తున్నట్టు తెలుగుదేశం వర్గాలవారు కొందరు వ్యాఖ్యానించారు. నిజానికి శ్రీనివాసులురెడ్డికి రాజకీయంగా తెలుగుదేశం ఉత్తమ ఆశ్రయం. కాంగ్రెసులో తనకు తన కుటుంబానికికూడా రాజకీయంగా భవిష్యత్తు లేదని. శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి తన రాజకీయ ప్రత్యర్థి అని భావిస్తున్న కారణంగానే ఆయన తెలుగుదేశంలో చేరారు. ఆయన అదృష్టం - నాలుగేళ్ళుగా ఆయన మంత్రిగా వున్నారు! తెలుగుదేశం ప్రభుత్వానికి ఏమిజరిగినా నెల్లూరుజిల్లాకో శ్రీ జనార్ధనరెడ్డికి మళ్ళీ పెత్తనం లభిస్తుందన్నది ఆయన భయం. అందువల్ల తెలుగుదేశం పార్టీపట్ల, ఆ పార్టీ నాయకుడు శ్రీ ఎన్. టి. రామారావు పట్ల విధేయంగా వుండడంతప్ప ఆయనకు రాజకీయ ప్రత్యామ్నాయం మరొకటి ఏముంది?

- ఎన్టీఆర్‌పై నల్లపరెడ్డి భక్తి అందరికీ ఆశ్చర్యం కలిగిస్తూంది తెలుగుదేశం పతనమైతే కాంగ్రెస్‌లో బ్రతకలేమనే భయమే ఇందుకు కారణమా?
- అల్లుడుగారికి ఆనంవారి పొడే గిట్టడంలేదు !

మంత్రిమండలిలో శ్రీ వెంగళరావుకు వ్యతిరేకంగా తీర్మానం చేయాలని పట్టుపట్టిందికూడా రెవెన్యూ మంత్రి కావడం విశేషం. నిజానికి ఈ తీర్మానం అనవసరమని కొందరు మంత్రులు వాదించారు. ఒక రాజకీయ ప్రత్యర్థి చేసిన విమర్శలపై మంత్రి మండలిలో తీర్మానం చేయడం లేనిపోని విలువ ఇవ్వడం అవుతుందని, వారి విమర్శలకు మంత్రులు విడిగా జవాబులు ఇవ్వడమే ఉత్తమమని మంత్రిమండలి తీర్మానం చేయడం మంచిదికాదని శ్రీ కె. ఇ. కృష్ణమూర్తి శ్రీ ఆర్. రాజగోపాలరెడ్డి ప్రభృతులు చెప్పారు కాని శ్రీనివాసులురెడ్డి పట్టు

—కొరవ 7 వ పేజీలో

## రాష్ట్ర ప్రభుత్వంపై కేంద్రం విచారణ

(మా హైదరాబాదు ప్రతినిధి)

తెలుగుదేశం ప్రభుత్వంపై త్వరలోనే కేంద్ర ప్రభుత్వం విచారణ జరిపించనున్నదనే వార్తలు రాష్ట్ర రాజకీయ వర్గాలలో ప్రచారంలో వున్నాయి. రాష్ట్ర ప్రభుత్వంపై విచారణజరపడానికి కేంద్ర ప్రభుత్వం త్వరలోనే ఒక విచారణ సంఘాన్ని నియమించే అవకాశాలు వున్నాయని చెబుతున్నారు. కేంద్రం ఆయా పథకాలకు అందజేస్తున్న నిధుల వినియోగం విషయంలో పెక్కు ఆరోపణలు వస్తున్నాయి. తెలుగుదేశం ప్రభుత్వం వివిధపథకాలకు పేర్లుమార్చి తన సొంత పథకాలుగా అమలుజరుపుతున్నదని కేంద్ర మంత్రి కాకముందే శ్రీ జలగం వెంగళరావు విమర్శలు చేయడం, దీనిపై రాష్ట్ర పర్యటన సమయంలో ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్‌గాంధీకూడ పరోక్షంగా రాష్ట్ర ప్రభుత్వాన్ని సున్నితంగా హెచ్చరించడం జరిగింది.

గ్రామీణ క్రాంతిపథకం అమలులో తెలుగుదేశం ప్రభుత్వం రాజకీయదృష్టితో వ్యవహరిస్తున్నదని, ఆయా జిల్లాలలో నిబంధనలకు వ్యతిరేకంగా కోట్లాదిరూపాయలు తమపార్టీ కార్యకర్తల సిఫారసుపై మంజూరుచేసిందని, అవన్నీ తెలుగుదేశం కార్యకర్తలు పనులుచేయకుండానే స్వాహా చేసేశారని మాజీ ముఖ్యమంత్రి ఆయన విజయభాస్కరరెడ్డి కొన్ని తీవ్రమైన ఆరోపణలు చేశారు. వీటి నకళ్ళను ప్రధాన మంత్రికికూడ పంపారు. సి. బి. ఐ. చేత విచారణ జరిపించాలని ఆయన ప్రత్యేకంగా సూచించారు.

మండల ఎన్నికల ముందే జరిపించాలని కేంద్ర మంత్రుల పట్టుదల

ఆతర్వాత కేంద్ర వాణిజ్య మంత్రి

—కొరవ 7వ పేజీలో

# జమీన్‌రైతు

## ఎటుపోతున్నదీ దేశం?

స్వాతంత్ర్యం సిద్ధించిన నలభైఏళ్ళ తర్వాత మనం దానికి అర్హులమా అని ప్రశ్నించుకోవడం హాస్యాస్పదంగా కన్పించవచ్చు గాని; దేశంలోని ప్రస్తుతపరిస్థితులు, పరిణామాలు ఆ ప్రశ్నకు విధి లేని తావుకల్పిస్తున్నాయి.

నలభైఏళ్ళ క్రితం మనం కలలుగన్న స్వతంత్రదేశం వేరు; ఈనాడు మనం చూస్తున్నది వేరు. సమగ్రము, సుభిక్షము, శాంతి మయము, సర్వజనులకు సౌఖ్యప్రదాయము అయిన దేశంకోసం, జీవనంకోసం మన పూర్వీకులు తమ జీవితాలు త్యాగంచేశారు; జైళ్ళపాలైనారు; లాఠీదెబ్బలు తిన్నారు. కోట్లాది త్యాగమూర్తుల రక్తతర్పణంతో పునీతమైన స్వాతంత్ర్యాన్ని ఈ తరం భారతీయులు సంకుచితత్వంతో కలుషితంచేస్తున్నారు; విషతుల్యంగామారుస్తున్నారు.

ఈరోజు దేశంలో అన్నిటికన్నా కరువుగావుండేది- ప్రశాంతతే! ఒక్క ప్రాంతం, ఒక్క రాష్ట్రంలోకూడా ప్రజలు నిశ్చింతగా, మనశ్శాంతితో బ్రతకలేకపోతున్నారు. ఎక్కడచూసినా అల్లర్లు, ఆందోళనలే; ఏరోజు పత్రికతీసినా అరాచకపు వార్తలే!

పంజాబ్‌లో తీవ్రవాదుల సమస్య భారతజాతి రాజకీయ వ్యవస్థను రాచపుండువలె పీడిస్తూంది. దాని దుష్ప్రభావంతో ఢిల్లీ, హర్యానా, ఛండీగర్ ప్రజలుకూడా గుండెలు గుప్పెట్లో పెట్టుకొని బ్రతుకులీడుస్తున్నారు. కొంచెంపైకిపోతే పాకిస్తాన్ ఏజంట్ల దుశ్చర్యలతో కాశ్మీర్ రాష్ట్రం అశాంతిమయంగా వుంది. ఒప్పందాలు కుదిరినా అస్సాం, మిజోరం సమస్యలు ఇంకా పూర్తిగా పరిష్కారం కాలేదు. త్రిపురలో గెరిల్లాలు, బంగ్లాదేశ్ ప్రభుత్వము ప్రజాజీవనాన్ని దుర్భరం చేస్తున్నారు. అరుణాచల్ ప్రదేశ్‌లో శాంతిని చైనా దేశం హరించివేస్తూన్నది. పశ్చిమ బెంగాల్‌ను గూర్ఖా ఆందోళన రగిలే అగ్నిగుండంగామార్చివేసింది. కొంకణిభాషసాకుతో గోవాలో జరుగుతున్న ఆందోళన అదుపుతప్పిపోతూంది; మహారాష్ట్రలో శరద్‌జోషి నాయకత్వంలోని రైతు ఉద్యమం, శివసేన మత తత్వం తరచు హింసాకాండకు దారితీస్తున్నాయి; తమిళనాడును మరొక పంజాబు చేసినదాకా కరుణానిధికి నిద్రపట్టేటట్టులేదు. కర్ణాటకలో మతోన్మాదులు తలపెడుతున్న దుర్మార్గాలు అన్నిన్నికావు. తెలుగుదేశం ప్రభుత్వం అసమర్థతవల్ల ఆంధ్రప్రదేశ్‌లో ఎంత తరచుగా ప్రజాజీవితం సంక్షోభాల పాలౌతున్నదీ మనకు అనుభవమే.

ఒక్కమాటలో చెప్పాలంటే దేశమంతా అరాచకత్వంతో అట్టుడికిపోతూంది. ఈ ఉద్యమాలు, ఆందోళనలు, అల్లర్లు ప్రజలలో సంకుచితత్వాన్ని ప్రేరేపిస్తున్నాయి. ఏ మతానికామతం, ఏ రాష్ట్రానికారాష్ట్రం, ఏ భాషకు ఆభాష, ఏ కులానికాకులం, ఏ నగరానికానగరం, ఏ గ్రామానికాగ్రామం ముక్కచెక్కలుగా విడిపోయే ప్రమాదమేర్పడుతూంది. ఇప్పటికే వివిధరాష్ట్రాలు, వివిధ మతాలు, వివిధజాతుల ప్రజలమధ్య సామరస్యభావం క్షీణించిపోతూంది; పరస్పరం అనుమానించుకునే స్థాయికి దిగజారిపోతూన్నది పరిస్థితి.

ఈ దుస్థితి ఇట్లా కొనసాగవలసిందేనా? ఒకవిషమైన సంధి కాలంలో వున్న దేశాన్ని గట్టెక్కించే నాథులెవరు? ఇప్పటి నాయకులు, రాజకీయ పార్టీలకు అంతటి సామర్థ్యం వుందనుకోలేము. నిజానికి ఈనాడు దేశ రాజకీయ వ్యవస్థ ఇట్లా ఛిన్నాభిన్నం కావడానికి సరైన జాతీయస్థాయి నాయకత్వం లేకపోవడమే ప్రధాన కారణమన్నా అతిశయోక్తికాదు. ప్రజలను జాగృతంచేసి, మన ఎదుట వున్న అనేకానేక సాంఘిక ఆర్థిక సమస్యల పరిష్కారానికి వారిని కార్యోన్ముఖులను చేయగలిగిన వారేలేరు.

నిజానికిది ఒక్కరితో జరిగేపనికూడాకాదు; దేశంలోని అన్నివర్గాల రాజకీయవాదులు, మేధావులు పరిస్థితిక్లిష్టతను గ్రహించి, ఈ గండం గట్టెక్కడానికి మార్గాన్వేషణ చేయడం అవసరం. ప్రజలలో క్షీణించిపోతున్న జాతీయభావాన్ని పునరుద్ధరించడం అందరి కర్తవ్యం. అటువంటి భావసంపన్నత కల్గితేతప్ప, వివిధ రాష్ట్రాలలో చెలరేగుతున్న ఆందోళనలు సమసిపోవు; శాంతి నెలకొనదు.

## జమీన్‌రైతు

25-12-1986

**పాత అధ్యక్షుడు**

కుమారరాజాగారికి స్వాగతం
సీనియర్ ఒట్టగొరలై బల్లెటూళ్ళకొస్తివిరుద్ధ
ఈవల కంలోన నేనిగంటే?
అరుపందల సూక్కుళ్ళ అధ్యక్షన్న
మగుచున్న-
మత్యుకొక్కటిజూచి వచ్చినావె?
పీటింగు సమయంపునాటి
ముత్పటిగాని-
తర్వాత కోర్టును దర్శినావె?
తలుచుగా కారులో దయసేయ
నపుడైన-
ట్రంకురోడ్డు రిపేరు తలచినావె?
నిన్ను అనుకొన్న ఫలమేమి?
నిరుపయోగు
అత్మవంచన లర్థకాంక్షితుల ఘనులు
పొత్తుకూటికి తరచు మాత్రోదరంబు
పైతమును తీర్చి రక్షించు
స్వార్థపరుల.

**పశువులను దొడ్డిలో తోలుట**

కాలకార్యాలు నడుకొనవలయుగాని.

ఇటీవల జరిగిన జిల్లాబోర్డు ఎన్నికలలో ఎక్కెటువారికివెంకటగిరి జాగా సిద్దాగుంట గ్రామమునకు కంచె వృద్ధి నిరాకరించిరి,వారి పశువులనుబందెల దొడ్డిలో కొట్టిరి. రైతులు బందె ఇచ్చి విడుదలచేయించుకొనిరి 23తేది దాట అగ్రహారం, బంగారుపేట. కలపాడు పశువులు 48 దొడ్డిలో తోలబడినవి అక్రమంగా.

**ఎక్సైటుద్యోగ వాంఛితులకు**

ఈ క్రింది మంత్రముగల శాకము గతనెల 12తేది నేను రైలులో ప్రయాణం చేయుచుండగా బెజవాడ స్టేషనులో నా పెట్టెలో నుండి కొంతమంది దిగిపోయిన వెనుక బల్లపై పడియుండినది. ఈ మంత్రము క్రింద "ఎక్సైటువందు ఉద్యోగములు సింతు గులాము లు. దినమునకొక పూట ఉపవసిస్తున్నతో ఐక్య ప్రతుకై మండలదినములు యీ మంత్రమును జపించి మద్రాసు కువ్వము నదిలో స్నానము నర్పిన యీరల తక్షణ ఉద్యోగము లభించును." అని వ్రాయబడి వున్నది. ఈ కాగితము సు గుర్తించగల పూర్వాపర సందర్భము తెలియు లేదు. యీ మహామంత్రో చ్చారణమున, ఎక్సైజు నందు ఉద్యోగ వాంఛితులై ఎట్టి అకార్యములు చేసియు నొనరించు అవిచారపరులకేమైనా ఉపకరించునేమోయని దానిని యధార్థముగా ప్రకటించుచున్నాను.

"రాజాధీనం జమీన్ సర్వం
భృత్యాధీనం తు రాజః
తద్భృత్యో దాసియాధీనం
దాసియే మనుదేవతా:"

భాషాకోవిదులు నావిగావు.

-ప్రయాణికుడు

**అపులింత 80 గంటలు**

న్యూయార్కు నగరంలో 27ఏండ్ల వయస్సు గల ఒక స్త్రీ 80 గంటల సేపు ఆపకుండా ఆవులించడం మొదలెట్టింది, వెంటనే వైద్యుని పిలిపించితే ఆతను నిద్రపోవడానికి మందు యిచ్చాడు. ఆ విధంగా కొంతసేపు నిద్రపోయింది, మెలకువ వచ్చిన తర్వాత మళ్ళీ ఆవులించలేదు.

## జాఫర్ సాహెబ్ కాల్వగతి ఇంతేనా?

పెన్నజిల్లా పరిస్థితి ఎంత అధ్వాన్నంగా తయారైవుందో తెలుసుకోవడానికి జాఫర్‌సాహెబ్ కాలువ పరిస్థితి చూసినా చాలు. సగంపైగా పడిపోయింది ఇది. అసలు పెన్న దగ్గర తూములే శిధిలమైపోయాయి. ఆనకట్టలో వేసివున్న ఇసుక మేటవల్ల వరద సమయంలో తప్ప నీరెక్కడంలేదు. దారిపొడుగునా కట్టలు జారిపోయి కాలువ ఇరుకైపోయింది.

దీనికి తగ్గట్టు చెరువులుకూడా చెడిపోయాయి. రిపేర్లులేక, గండ్లు పూడ్చేవాళ్ళులేక, బురదమేటలు తొలగించేవాళ్ళులేక సగం చెరువులు దండగైపోతుంటే, చెరువును మాగాణిగా మార్చి పట్టాలిచ్చి పూర్తి నిరుపయోగంచేశారు.

మా గ్రామం విషయమే చూసినా, జాఫర్‌సాహెబ్ కాల్వక్రింద దాదాపు రెండువేల ఎకరాల ఆయకట్టు వుంది. చెరువు మాగాణిగా మారిపోవడంతో కాలువలో నీళ్లు పారితేనే పయ్యిలు తడుస్తాయి. అయితే పి డబ్ల్యు డి అధికారులు బ్రిటిష్ కాలంనాటి పద్ధతిలో వారానికి రెండురోజులే నీళ్లు వదలుతున్నారు. ఒక్కొక్కసారి అవి గ్రామ పొలిమేరవరకుకూడా రావు. వానలులేక, చెరువునిండక, కాలువపారక ఎక్కడి పైర్లక్కడ ఎండిపోతున్నాయి. ఎందరో అధికార్లకు ఈ విషయం చెప్పుకున్నాం; పాత కలెక్టరు కుమారి సుజాతారావుగారు మా దుస్థితిని కళ్ళారాచూసి న్యాయం చేస్తామని చెప్పారు. కానీ జరిగింది శూన్యం.

రైతుల సమస్యలపట్ల ప్రభుత్వానికింత నిర్లక్ష్యమైతే, గ్రామాలేమైపోవాలి? గ్రామీణప్రజలేమికావాలి? దీనికి నివారణ అంటూ లేదా?

-పొన్నలూరు శివకోటారెడ్డి
మాచర్లవారిపాలెం

**శివాలయాన్ని చక్కదిద్దండి!**

నెల్లూరులో పురాతన, ప్రసిద్ధ దేవాలయాలలో మూలపేట మూలస్థానేశ్వరస్వామి దేవాలయం ఒకటి. ఇటీవలి కాలంవరకు ఇది జనంతో కిటకిటలాడుతూ వుండేది. ఇప్పుడు ఆదరణ తగ్గిపోయిందో, గుడి ఆవరణం వెలవెలలాడుతూ, తెలతెలపోతూవుంది.

టౌనులోని రాజరాజేశ్వరి దేవాలయం వంటివి నిర్మాణకళ్యాణం తత్పరతోరణంగా అభివృద్ధి చెందుతూవుంటే, ప్రసిద్ధమైన




ఈ శివుడుమాత్రం భక్తులకోసం ఎదురుచూడాల్సిన దుస్థితికల్గడం శోచనీయం.

ధర్మకర్తల మండలిలో యువకులు, పురప్రముఖులే వున్నారు. వారు కొంచెం శ్రద్ధతీసుకుని అక్కడప్పుడు దేవాలయంలో చిన్న చిన్న కార్యక్రమాలు నిర్వహిస్తూ శనివారిపై సరైన ఆజమాయిషీ చేస్తే శివాలయానికి పాతవైభవం మళ్ళావస్తుంది, ఆ కార్యం సత్వరం నెరవేర్చాలని మనవి.

నెల్లూరు -నెల్లూరు బజయ్య




# కావలిలో ప్రేలింది తెలుగు బాంబులా?

కావలి టౌనులో, ఆర్టీసి బస్టాండు ఎదురుగా 20 తేదిరాత్రి నాటుబాంబులు ప్రేలి ఒకవ్యక్తి చనిపోయాడు; మరొకరికి తీవ్రమైన గాయపడ్డాడు.

కర్నూలుజిల్లాకు చెందిన పి. శివారెడ్డి అనే వ్యక్తి సంవత్సరం క్రితం కావలికి వచ్చి, ఇళ్ళ స్థలాల అమ్మకం వ్యాపారం ప్రారంభించాడట. ఎందువల్లనో ముఖపరిచితుడుకూడా కాని ఈ పరాయివానితో కావలి తెలుగుదేశం ప్రముఖులందరూ సంబంధాలు పెట్టుకొని ఇళ్ళ స్థలాలమ్మిపెట్టారు. అందులో ప్రసిద్ధికెక్కిన కావలి తెలుగు మహిళకూడా ఒకరు.

ఈ శివారెడ్డి గతచరిత్ర మనకు తెలియదు కాని, అతనెప్పుడూ కావలిలో బాడీగార్డులను ప్రక్కనుంచుకొని కార్లలో మాత్రమే తిరిగేవాడట. బాడీగార్డులలో ఒకరైన సత్తిరాజుకు, ఒక మోటార్ మెకానిక్‌కు స్కూటర్‌రిపేరు విషయంతో తగాదా వచ్చిందట. ఆ మెకానిక్ క్యాంపుకు ఈ విషయం తన బంధువులకు చెప్పడంతో వారందరూ కలిసి రాత్రి 9 గంటలప్పుడు రియల్ ఎస్టేట్ ఆఫీసు మీదకొచ్చి, సత్తిరాజును కొట్టబోయారట. అతను వెంటనే వీరిపై రెండు నాటు బాంబులు విసిరాడట. వాటి దెబ్బకు సచ్చిదానందం అనే స్థానిక రౌడీ అక్కడికక్కడే చనిపోతే మెకానిక్ తండ్రి వందనం, బాంబులు విసిరిన సత్తిరాజు గాయపడ్డాడు. తర్వాత పోలీసులొచ్చి వీరిని నెల్లూరు ఆస్పత్రికి తరలించి, ఆఫీసుకు తాళాలువేసింది.

అసలి శివారెడ్డి అనే వ్యక్తి ఎవరు? అతని వ్యాపారంలో కావలి పెద్దలందరూ ఎందుకు భాగస్వాములైనారు? శివారెడ్డికి కేవలం ఇళ్ళస్థలాల వ్యాపారమేనా, బాంబుల అమ్మకాలు కూడా వున్నాయా? వుంటే అవి ఎవరెవరికి చేరుతున్నాయి? టౌను తెలుగు మహిళా దులకు ఈ ఇళ్ళ స్థలాలలోనే సంబంధమా, లేక బాంబుల్లోనూ భాగముందా? ఇవన్నీ సందేహాలే. పోలీసులిప్పటివరకు ఈ కేసులో ఎవర్నీ అరెస్టు చేయలేదు! వారి విచారణ న్యాయంగా జరిగి నిజాలు బయటకు వస్తాయా, లేక తెలుగుపెద్దల హుకుంలకు లొంగిపోయి మాయ చేస్తారా అన్నదికూడా సందేహమే!

## విరవసంతుడు

మన్య హోం మంత్రి శ్రీ వసంతనాగేశ్వరరావు 26 తేది ఉదయం నెల్లూరు వచ్చారు. నరసింహ కొండపై వైరలెస్ టవర్ కు, స్టేషన్లో కొత్త పోలీస్ స్టేషన్, నెల్లూరులో 3 టౌన్ స్టేషనుకు కొత్త భవనానికి శిలాన్యాసం చేశారు. మనమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి గారాయనను విరవసంతరాయలని పిలాచ్రట. నరసింహకొండ సభలో ఆ బిరుదానికి అర్హు డైన వసంతరాయలవారు విరంగారావట అనరక! తెలుగుదేశం మంత్రులకు చిన్నా పెద్ద తేడా లేకుండా ఈ భజన కార్యమంటుకున్న దేమిటండి!

## మంత్రుల ఘెరావ్

23 తేది మధ్యాహ్నం ప్లానింగ్‌బోర్డు సమావేశానికని వస్తుండిన మంత్రుల ద్వయాన్ని జిల్లాకోర్టు ఎదురుగా ఆటకాయించి, ఘెరావ్ చేయబోయారు. ఈ కోగా పోలీసులు రావడంతో వాంకాయిదారు అరెస్టయింది.

ఎన్జీఓలు డి.ఇ. ఆఫీసుదగ్గర ఘెరావ్ చేస్తారని అనుకొని పోలీసులంతా అక్కడే కేంద్రీకరించారు; అయితే వారు తెలివిగా కోర్టుదగ్గర నిలిపేశారు.

## ఎన్జీఓల సమ్మె

ఎన్జీఓల సమ్మెతో మార్చిమిలేదు ఆఫీసులన్నీ ఖాళీనే! కలెక్టరుగారు మాత్రం 665 మంది ఎన్జీఓలు డ్యూటీలకు వస్తున్నారని చెప్తున్నారు. కాని, వాస్తవానికి ఆ సంఖ్య అందులో సగమని ఎన్జీఓ నాయకుల అంచనా! జిల్లాలోని మొత్తం ప్రభుత్వోద్యోగులు 11 వేలైనప్పుడు 5 వందల మంది వచ్చి ఒకటే, రాకా ఒకటేగదా!

జిల్లాపరిషత్, గాంధీబొమ్మ తదితర చోట్ల నిరాహారదీక్షలు జరుగుతూనే వున్నాయి.

## ఎస్. పి. బదలీ

నెల్లూరు జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ ఆర్. ఆర్. గిరీశ్‌కుమార్ హైదరాబాదు నగర డిప్యూటీ కమిషనర్ ఆఫ్ పోలీసుగా బదలీ అయ్యారు. ఆయన స్థానంలో కడప ఎస్. పి. శ్రీ పూర్ణచంద్రరావు నియమితులైనారు.

గిరీశ్‌కుమార్ మాటలో, నడకలో, నడవడికలో సామ్యత పుష్కలంగా కలిగి; క్రింది పోలీసులకు ఆదర్శంగా, ఐలకొనకగా కన్పడిందా అని అనుమానం. పూర్ణచంద్రరావు లౌకికుడని ప్రసిద్ధి అట; ఆయన హోంమంత్రి శ్రీ వసంతనాగేశ్వరరావుకు దగ్గరి బంధువు.

## వేణుగోపాలస్వామి ఆలయం

మూలపేట- శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం మేనేజింగ్ ట్రస్టీగా శ్రీ ఆనం వెంకటరెడ్డి దీర్ఘకాలం వున్నారు కాబట్టి, ఆయన్ను కాకుండా మరొకరిని ఎన్నుకో వలసిందిగా హైకోర్టు ఆదేశించిందట. ఎవరో వేసిన ఒక రిట్‌పై తీర్పుచెప్తూ ఈ విధంగాఆదేశించినట్లు తెలుస్తున్నది.

ఆయనకూ వయస్సు అయిపోయిందనుకోండి!

## అమెరికా దొరలతో జనార్దనరెడ్డి

పాతిక, ముప్పయ్యేళ్ళక్రితం వాకాడు పరిసర గ్రామాలలో అమెరికా మిషనరీగా పనిచేసిన 'ఒబర్ రాపర్' కుటుంబీకులను ఇండియాకు పిల్చి భారతీయుల ఆతిథ్యాన్ని, సంస్కృతిని వారికి పరిచయం చేస్తున్నారు జనార్దనరెడ్డి. ఈ అమెరికా దొర చిన్నకుమారుడు, అతని భార్య, సంతానం ఇప్పుడు ఇండియా పర్యటనలో వున్నారు.

24 తేది ఉదయం వీరికి కృష్ణపట్నం రేవు చూపించి, యాంగ్లర్స్ ప్యారడైజ్‌లో వరగలి విందు తినిపించి, నెల్లూరుకు తీసుకవచ్చారు. ఈ సందర్భంగా ఆయన వారికిలేక పాత్రికేయులకు క్రిస్మస్ టీ ఇప్పించారు. ఆ రాత్రి వాకాడుకు వెళ్ళి, గ్రామీణ పౌరులు క్రిస్మస్ పండుగ జరుపుకునే తీరు వీక్షించి, జనార్దనరెడ్డితో కలసి దక్షిణ దేశ యాత్రకు వెళ్ళారు వీరు!

## ప్లానింగ్ బోర్డు

జిల్లా ప్లానింగ్ బోర్డు సమావేశం 23 తేది మధ్యాహ్నం 'రహస్యం'గా జరిగింది; పత్రికలవారిని రానివ్వమని ఖండితంగా చెప్పి తలుపులేసుకున్నారు. ఈ ఘోరణికి నిరసనగా సమావేశం చివర కాంగ్రెస్ ఎమ్మెల్యేలు నలుగురూ వాకౌట్ చేశారు.

## మరణం

నెల్లూరు ఇరిగేషన్‌శాఖ సూపరింటెండింగు ఇంజనీరుగా పనిచేసిన శ్రీ కె. వి. దుగ్గిరెడ్డి (58) 23 తేది కోర్టు పనిమీద నెల్లూరు వచ్చివుండి, గుండెపోటుతో ఇక్కడే మరణించారు. ఆయనది కడప జిల్లా; శవం అరోజే వారి స్వగ్రామం తీసుకపోఐడింది.

దుగ్గిరెడ్డిగారు నెల్లూరుతో సంబంధం కూడా కలవారు, ఆయన కుటుంబానికి మా సంతాపం తెలియజేస్తున్నాము.

## ధాన్యానికి గిరాకి తగ్గింది!

ధాన్యం మార్కెట్ చాల మందంగా వుంది; డిసెంబరులో ఈ విధంగా వుండడం చాల అరుదు, ఒక మిల్లరు చెప్పడం మొలగొలుకు ధాన్యం పుట్టి రూ 1700 లకు ఇస్తామన్నా గిరువారంనాడు కొన్నవాడు లేడని అన్నారు.

కారణం ఏమంటే కిలో రెండు రూపాయల బియ్యం స్వేచ్ఛగా మార్కెట్‌కు రావడం స్థానికంగా డిమాండు లేకపోవడానికి కారణమట. ఇది నిజమే! కొందరు డీలర్లు కార్డుకు కిలోకూడా బియ్యం ఇవ్వకుండా 25 కిలోలు ఇచ్చినట్లు వ్రాసేస్తున్నారు; అదంతా చిల్లరగా అమ్మకానికి వస్తున్నాయి. ప్రజల అవిద్య అజ్ఞానం చైతన్య రాహిత్యాలను ఆధారం చేసుకొని డీలర్లు ఈ ఆట ఆడుతున్నారు.

తమిళనాడు, కర్నాటకలలో గిరాకీయే లేదట. ఇవిగాక బాపట్ల వగైరాచోట్లనుండి రూ. 1430.00 లకే ధాన్యం నెల్లూరుకు చేరుతున్నాయట. ఇన్నికారణాలతో రెండువేలరూపాయలు తాకిన మొలగొలుకుధరపడిపోయింది, ఇక జనవరిలో కొత్తధాన్యానికిమాత్రం ఏమివుంటుంది?

మొలగొలుకు బియ్యం చిల్లరగా 70 కె.జి.ల బస్తా 9672 అయితే రూ 270 లు, 9674 అయితే రూ 305 లు అమ్ముతున్నారు.

# తెలుగు సినిమా పరిశ్రమను కొనుగోలుదారే శాసిస్తున్నాడు!

తెలుగు చలనచిత్ర పరిశ్రమలో చిత్రాలకు పంపిణీ కేంద్రం మన రాష్ట్రంలో ఒకేచోట ఉండేది - అప్పటి నిజాంతో కొంతకాలమయ్యాక నాలుగు కేంద్రాలుగా తయారయ్యాయి - కోస్తా, రాయలసీమ, నైజాం.

ఇప్పుడు కోస్తాలో ఆరు కేంద్రాలు, రాయలసీమలో రెండు కేంద్రాలు ఉన్నాయి. కొనుగోలుదార్ల సంఖ్య అంతా ఇంతా కాదు.

నాగేశ్వరరావు, రామారావు విజృంభిస్తున్న రోజుల్లో, నాగేశ్వరరావు చుట్టూ కొందరు, రామారావు చుట్టూ కొందరు చేరారు. హీరో ఆరాధన, వ్యక్తి పూజతో తెలుగుచిత్ర జగతి రెండుగా చీలింది. దాంతోనే ముసలం ప్రారంభమైంది. సినిమా మనుష్యుల్లో మార్పు వచ్చింది. ఆ తర్వాత కృష్ణ, శోభన్‌బాబుల ప్రవేశంతో గ్రూపులు ఎక్కువయ్యాయి. మాటకు విలువ లేకుండా పోయింది.

కథ కన్నా కథా నాయకుడే ముఖ్యం అనే నమ్మకం బలపడింది.

ఇప్పుడు తెలుగు చిత్రసీమలో గ్రూపులు కోకొల్లలు!

పెట్టుబడి పెట్టిన నిర్మాతకు విలువ లేకుండాపోయింది; హీరో, హీరోయిన్ల ఎదుట చేతులు కట్టుకుని నిలబడవాల్సిన దుస్థితి ఏర్పడింది నిర్మాతకు.

> లక్షల పెట్టుబడి
> పెట్టే నిర్మాతలు
> అందరికీ లోకువై
> పోతున్నారు!

హీరో ఏది చెప్పితే అది వేదవాక్యం అయిపోయింది. ఆయన ఎవర్ని హీరోయిన్‌గా వేసుకోవాలో శాసిస్తున్నాడు అంతేకాదు; డైరెక్టరు, కెమెరామన్, ఇతర సాంకేతిక నిపుణుల్ని కూడా సూచిస్తున్నాడు. ఆఖరికి సంఘాలవారు మీరు ఫలానా విధంగా ఫైట్స్ వేయాలి, ఇలా ఫైట్ వేయాలి-అని తమకు తోచిన సలహాలేవో ఇస్తూంటే, హీరో వాళ్ళను సంతృప్తి కరచడం ముఖ్యమనుకుంటున్నాడు.

దీనికి తగ్గట్టు ఇప్పుడు కొనుగోలుదారులుకూడా "మీ చిత్రంలో ఎన్ని పాటలు ఉన్నాయి, ఆ పాటల్లో ఎలాంటి కాస్ట్యూమ్స్ వేస్తున్నారు? ఎన్ని ఫైట్స్ ఉన్నాయి?" అని అడిగి తెలుసుకుంటున్నారు.

దాంతో నిర్మాతలకు వాళ్ళు చెప్పినట్టు వినడం తప్ప మరో మార్గం లేక పోయింది.

—కొరవ 11వ పేజీలో

'జైలుపక్షి'లో శోభన్‌బాబు, సుమలత

# జైలుపక్షి : కోడి దర్శకత్వమే జీవం పోసింది!

'హెచ్చరిక' చిత్రాన్ని పోలిన మరో చిత్రం కోడి రామకృష్ణ దర్శకత్వంలో వెలువడిన 'జైలుపక్షి'. రెండు చిత్రాల్లోను ప్రధాన పాత్రధారి పోలీస్ ఇన్‌స్పెక్టర్. సమాజంలో పెద్దమనుషులుగా చెలామణి అవుతూ అరాచకాన్ని సృష్టిస్తున్న దుర్మార్గుల్ని పట్టి చట్టానికి అప్పగించడం ఆ ఇన్‌స్పెక్టర్ల ప్రధానలక్ష్యం కలైమణి అనే తమిళుడు రాసిన కథను ఇద్దరు తెరకెక్కించడంతో ఒకే ఇతివృత్త నేపథ్యంతో రెండు సినిమాలు విడుదలయ్యాయి. తరచూపల్లో విజయవంతమైన ఇలాంటి చిత్రాల్ని తెనిగించడంలో తప్పులేదుకాని ఇలాంటి అనారోగ్యకరమైన పోటీ అవాంఛనీయం!

'జైలుపక్షి' ముగింపులోని వైవిధ్యం ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేస్తుంది. స్తబ్దతనుంచి చైతన్యంలోకి నడిపించే ఈ తరహా సన్నివేశ నిర్మాణాన్ని అందించిన దర్శక రచయితలు అభినందనీయులు.

సార్వభౌమారావును హంతకుడుతో హతమార్చిన దుర్గను బదులుగా ఆమెపై గల ప్రేమతో నిందను తనపై వేసికొని, ప్రతాప్ అనే పోలీస్ ఆఫీసర్ మరణశిక్ష అనుభవించడానికి ముందుకు రావడం అవాస్తవికతకు నెమలి పింఛం తగిలించడమే అవుతుంది.

"నేను హత్యచేసాను, నాకు శిక్ష వేయించి ప్రతాప్‌ను కాపాడండి" అని దుర్గ న్యాయవాదిని వేడుకొని తద్వారా నిర్దోషిని విడుదల చేయించాలన్న ఆ

> **సమీక్ష**
> సి. నారాయణరావు

త్రిమూర్తి మానవతావాదం మహోన్నత సందేశం!

మృగాన్ని చంపితే బహుమతులిచ్చే ప్రభుత్వం మృగంలాంటి మనిషినివధిస్తే మరణశిక్ష విధించడం ఎంతవరకూ సమంజసమని పతాకసన్నివేశంలో చక్రపాణి ప్రశ్నించడంతోపాటు దుర్గ కుటుంబానికి సార్వభౌమారావు చేసినఘోరాన్ని కూడా పరిశీలించి ఆమెకు శిక్షతగ్గించడం

—కొరవ 11వ పేజీలో

# స్మిత మృతికి ఎన్టీఆర్ స్పందించలేదేమి?

ప్రముఖనటి, పద్మశ్రీ అవార్డుగ్రహీత, మాజీ మహారాష్ట్ర మంత్రి శివాజీరావ్ పాటిల్ పుత్రిక స్మితాపాటిల్ మెదడులోని రక్తనాళాలు చిట్లినందువల్ల బొంబాయిలోని జస్లోక్ ఆస్పత్రిలో డిసెంబర్ 13 రాత్రి కన్నుమూసింది. హిందీ నటుడు రాజ్‌బబ్బర్‌ను వివాహము చేసుకున్న ఈమె అంతకు 20 రోజులక్రితం మగశిశువును ప్రసవించింది. డిసెంబర్ 12 న విపరీతమైన జ్వరం, సంధిస్థితిలో ఆమె హుటాహుటిగా ఆస్పత్రికి తరలించబడింది. ముక్కునుంచి, నోటినుంచి విపరీతంగా రక్తం స్రవించసాగింది. 15 మంది డాక్టర్ల బృందం చికిత్సచేసినా ఫలితం లేకపోయింది.

> మా మద్రాసు
> సినిమా ప్రతినిధి

ఒక దశాబ్దంలోగా ఆమె దాదాపు యాభై చిత్రాలలో నటించి, మూడు సార్లు జాతీయ అవార్డులు, ఒకసారి రాష్ట్ర అవార్డును అందుకుంది. నటనను సూక్ష్మంగా అధ్యయనం చేసిన ఈమె విద్యార్థిదశలో రాష్ట్ర సేవాదళ్‌లో పని చేసింది. బొంబాయి దూరదర్శన్‌లో మరాఠీవార్తలు చదివే అనౌన్సర్‌గా ఖ్యాతిగాంచింది. శ్యామ్ బెనగల్ "నిషాంత్" చిత్రంద్వారా 1974 లో సినిమానటి అయింది. "మంథన్", "భూమిక", "చక్ర" చిత్రాలలో అద్వితీయంగా నటించింది.

ఈమె నటించిన తెలుగుచిత్రం "అనుగ్రహం".

ప్రధాని రాజీవ్‌గాంధీతోపాటు మహారాష్ట్ర, కర్నాటక, గుజరాత్ ముఖ్యమంత్రులు స్మితాపాటిల్ మృతిపట్ల తమ విచారాన్ని వ్యక్తపరచారేకాని, సినిమా రంగంనుంచి రాజకీయ రంగంలో ప్రవేశించిన మన ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు మాత్రం తన సంతాపాన్ని వ్యక్తం చేయలేకపోవడం కొందరికి విస్మయాన్ని కలిగించింది.

## హరిరామజోగయ్య చిత్రం

మాజీమంత్రి, ప్రస్తుత శాసనసభ్యుడు చేగొండి హరిరామజోగయ్య చిత్రపరిశ్రమకు కొత్తవాడు కాదు. ఇంతకుముందు 'కృష్ణవేణి, చిలకమ్మ చెప్పింది' వగైరా చిత్రాలు నిర్మించాక రాజకీయరంగంలోకి వెళ్ళాడు. ఎన్.టి.ఆర్.ని ప్రధాని చేసేవరకు విశ్రమించను!' అని ఒకప్పుడు ప్రగల్భాలుపలికాయన. మంత్రిపదవి పోయాక ఆ నష్టాన్ని భరించేందుకు మళ్ళీచిత్రనిర్మాణంలో అడుగెట్టినట్టుంది. ఆయన సమర్పణలో 'అగ్నిపుష్పం' అనే చిత్రం తయారవుతుంది. ఇందులో భానుప్రియ చెల్లెలు రేఖ నాయిక

చేగొండి హరిరామజోగయ్యవల్ల ప్రభావితులై మరికొందరు మాజీమంత్రులు, శాసనసభ్యులు చిత్ర నిర్మాణరంగంలో ప్రవేశించినా మనం ఆశ్చర్యపోనక్కర లేదు!

—కొరవ 11వ పేజీలో

